శా. నిక్కంబారయసర్వలోకములకు ♦ న్నీవేకదా ద్రష్టవే
చక్కన్ విశ్వముసంచరింతువా? యిటుల్ ♦ శాసించువారెవ్వరో?
యిక్కాలాత్మకచిత్రిమేమొ యెఱుగన్ ♦ యిష్టార్థముల్ సెప్పియే
ఫక్కిన్నిన్ దనియింపనేర్తునొకొ? దే ♦ వా! సూర్యనారాయణా!
శా. దేవేంద్రాదిసురాళియైన భవదు ♦ ద్దేశంబుగుర్తింపలే
రే వాక్కుల్ లిఖియించి నీకభిమతం ♦ బేరీతి సంధింతునో?
యీవాచాలతయందుగల్గు దోసగుల్ ♦ వీక్షింపకెల్లప్డు నా
భావంబచ్ఛతరంబుసేయుమయ! దే♦వా! సూర్యనారాయణా! 6
శా. నీతుల్ సెప్పెడుపద్యసత్కృతికి నిన్ ♦ నేతందగంజేయ నే
నీతీరందితి పూర్వసత్కవులు యె ♦ న్నే నిట్టిపొత్తంబులన్
జాతుర్యంబునచేసియుండినను నా ♦ శక్తిన్ యిటుల్ చూపగా
చేతంబందునశంకఁజెందవలదో! ♦ శ్రీ సూర్యనారాయణా! 7
శా. నీవేప్రాణవిధానదానవిదితా ♦ నేకప్రభావుండవున్
నీవే లోకమునెల్లబ్రోచుకరుణా ♦ నిష్ఠాగరిష్ఠుండవున్
నీవే సంహృతజీవభాసితకరా ♦ నీకాప్తశక్తుండవున్
నీవైచిత్ర్యములెన్ననాకు తరమా ♦ నే? సూర్యనారాయణా! 8
శా. ఏదో బాల్యజ చాపలంబుననె నే ♦ నీకీర్తివర్ణింప నా
మోదంబూనితిగాని నిన్నుపొగడన్ ♦ బూర్ణప్రభావుల్ మునుల్
వేదంబుల్ దగుశక్తినొందనపుడీ ♦ విస్తార సంసారవాం
ఛాదర్పాత్ముఁడు యెట్టులర్హుఁడగు? నీ ♦ శా! సూర్యనారాయణా!
శా. భూదేవాళియు, సర్వభక్తులును నిన్ ♦ బూజించి, భావించుచున్
వేదోక్తాత్మ నమస్కృతుల్ ప్రతిదినం ♦ బేకాగ్రతంజేయుచున్
ఖేదంబుల్ దిగనాడియుందురు భవోత్క్లేశంబులం దూరుచున్
భేదంబొందని చిత్తమందుదురు భూ ♦ మిన్ సూర్యనారాయణా.
శా. ఏద్రైనన్ భువి నంతరాయముల నెం ♦ దే నొందగావచ్చు గా,
నీదృగ్ఘోరతర ప్రియాణజనితా ♦ నేకాబ్ద మూలంబునా
నీదాయాత్రికు నడ్డురాదు సుమి యెం ♦ దేని న్నిమేసంబునన్
భేదంబుండదు నీకు తీవ్రగమనా ♦ ప్తిన్ సూర్యనారాయణా.

శా. కాలంబంతయు నీదుమూలమున నే ♦ గా? యిట్లు వైచిత్ర్యసం
మూలంబై క్షణబద్ధనిత్యగతియై ♦ పూతస్వభావాత్మయై
మాలిన్యాప్తవిదూరశక్తియుతమై ♦ భావాఽనభిజ్ఞాంగమై
బోలన్ చిత్రపుచక్రసంగతిని బో ♦ వున్ సూర్యనారాయణా! 12

మ. సకలాఽఽధారుఁడవై నిరామయుఁడవై ♦ స్వర్ధామపూజ్యుండవై
యకలంకోజ్జ్వలమూర్తివై వెలుఁగునీ ♦ యాకారమీయొక్కటే
సకలప్రాణులదృష్టిఁ గన్పడెడు వి ♦ శ్వంబందునన్ దేవతాఽ
ధికమా మూర్తియుగాఁగ భాసిలునుగా ♦ దే? సూర్యనారాయణా!

శా. అస్తోకప్రతిభాఽమరాళినుతవి ♦ శ్వాఽఽరాధ్య తేజుండవున్
హస్తాగ్రామలకాయమానుఁడవు ని ♦ న్నాత్మన్ భజించి ప్రభా
విస్తారంబగు నీమహత్త్వమున స ♦ ర్వేష్టాఽర్థముల్ వొంది, వి
ధ్వస్తాఽఽమోహతనొందఁగోరితిని దే ♦ వా సూర్యనారాయణా!

మ. ఎదియోదోసముఁ జేయనట్టి మనుజుం ♦ డీలోకమందుండఁడో
సదయాత్మా! నరబుద్ధిగావునను చాం ♦ చల్యంబుతానొందియున్
తుదినేబోధనొంచె ది, తప్తమయి యొ ♦ త్తో మెఱుగుబంగారపుం
బదులంబొనగవోలె భాసిలును దే ♦ వా! సూర్యనారాయణా! 15

శా. మేలు గూర్చెడు ధర్మనీతులను తా ♦ మెల్లప్పుడున్ వ్రాయుచో
కాలంబల్లె చనంజనన్ తుదకు పా ♦ కంబొంది చిత్తంబునం
దేలీనంబయి యాచరించు క్రమబు ♦ ద్ధిన్ నూరుచో పాకస
మ్మేళంబొందెడి యౌషధంబు వలె జీ ♦ వాత్మా! సూర్యనారాయణా!

శా. నానారీతుల భక్తిభావములచే ♦ నానందముంజెందుచో
జ్ఞానోద్భూతము మూఢజన్య మనుచుం ♦ జర్చింపగా నేల? నే
నైనన్ మోక్షపదంబుఁగోరు నదియే ♦ తద్భావపుసద్భక్తియం
చేనెంచందగునంచు దోచెడునయా! ♦ శ్రీసూర్యనారాయణా! 17

మ. ధరణిన్ మానవజాతి నార్యులెగదా? ♦ ధర్మంబునందెంతయో
గురుధామంబును బొందిరిప్పుడు సుయో ♦ గ్యుల్ ధర్మసంచారులున్
కలవైపోయిరి కారణంబు తెలియం ♦ గారాదు కాలక్రమం
బరయన్ జిత్రముగాఁగ దోచుసుమి దే ♦ వా! సూర్యనారాయణా!

శా. జాతుల్ నాలుగు సృష్టియయ్యనుభువిన్ ♦ సర్వేశ్వరాజ్ఞన్ యిటుల్
నీతుల్ కర్మలు ధర్మముల్ దెరువులున్ ♦ వేర్వేరులైయుంటచే.
నేతద్ధర్మము లెందొగాని యిపుడ ♦ న్వేషించినన్గానరా
తీరుంగనె నేమిలోకము? సుమూ ♦ శ్రీ ! సూర్యనారాయణా! 19

శా. వాదంబేలనొ? కర్మజేయుటలొ స ♦ ద్వాంఛానిజధ్యాత్మకున్
యేదైనన్ కులధర్మసిద్ధమగుచో ♦ నేదోషముంగల్గదా
భేద బుద్ధియు చంచలాత్మజనితం ♦ బేయాను మోక్షార్థి యెం
దేదృష్టిన్గనినన్ సుదంబుగనుగా ♦ దే? సూర్యనారాయణా! 20

మ. సతత బీశ్వరభక్తిగల్గు జనుండే ♦ సంసారముందుండియున్
వెతలంబొందక సర్వకార్యములు వి ♦ శ్వేశేచ్ఛచేగల్గు నం
చతిధైర్యంబగు చిత్తముంగలుగగా ♦ నానందముంజెందు సం
చితకష్టంబులనైన ఖేదపడడో! ♦ శ్రీ సూర్యనారాయణా! 21

మ. మదిలోనొక్కటిబైటనొక్కటియునౌ ♦ మాటల్ వృధాపల్కుచున్
మొదలోనేమియు భక్తిలేనిమనుజుం ♦ డీ కూరసంసార సం
పదలన్ సంతసమంది కష్టగతి నా ♦ పత్కాలమే తెంచుచో
మొదియుందోచక గుందిచింతపడుగా ♦ దే ? సూర్యనారాయణా !

శా. సత్యంబౌ తగుభక్తిలేనపుడు వే ♦ సంబంతయున్ మార్చి దే
శత్యాగంబొనరించి తిర్గినను లే ♦ శంబైన లాభంబులే
ద త్యాచారములన్ని నేల ? నిజస ♦ న్యాస బునంగుండి దో
షత్యాగంబొనరించు భక్తునకు యీ ♦ శా! సూర్యనారాయణా!

శా. వ్యామోహంబునమున్గియుండుజనుడే ♦ వాంఛాగదింబొందడా
శామాహాత్మ్యముచేత నల్లపుడు సం ♦ సారంపు నిస్సారతన్
ధీమత్వంబున యోజసేయుడు సుబు ♦ ద్ధిగల్గు భక్తాళికే
కామబంతయుదుచ్ఛమౌచు తెలియుం ♦ గా? సూర్యనారాయణా!

శా. ఆలున్ బిడ్డలుగల్గగోరుచు తమం ♦ తందామె దుర్వార బం
ధాలింగంతముజుట్టుకొంచు వెతలం ♦ దం జూడగా నేల ? ని
ర్మాలిన్యాత్మలో యోజసేసిన తమో ♦ మాహాత్మ్య జన్యంబటం
చేలాదోచదు ? యెందుకీభవ? మహా!♦ శ్రీసూర్యనారాయణా!

శా. కాలంబెలపుడొక్కతీరుగఁజనం ♦ గాఁబోదు యేవేళయుం
దేలోకంబు ఘటిల్లునో యెఱుఁగరా ♦ దీస్వర్గసంసారమో
హాలింజిక్కి నశించుచుండ్రె సకల క ♦ ష్టావాప్తికిం బంధమే
మూలంబంచు నెఱుఁగలేరు కతమే ♦ మో? సూర్యనారాయణా!

శా. సర్వార్థంబులు దైవయోగమున నే ♦ చాలన్ గతించున్ వృథా
గర్వం బొందుటెకాని మానవుని కాం ♦ క్షల్ సాగగా నేరవా
సర్వేశాజ్ఞయెలేక పోవు నడలే ♦ శంబైన కార్యంబు నీ
యుర్విం జేయఁగ శక్తియుండదుగదా? ♦ యో! సూర్యనారాయణా!

శా. దోసంబెంతయు చేయువాఁడు తనకే ♦ దో కార్యవిఘ్నంబు రా
నీసుంజెంది పరాత్పరుండె తన ♦ కిట్లె కష్టముల్ గూర్చి తా
దోసంబొందెనటంచు దూఱి వెతగుం ♦ దుంగాని యెన్నండు లో
నోసగా మానుచు తప్పునొప్పుకొనఁడీ ♦ శా! సూర్యనారాయణా!

శా. కష్టంబేయగు సౌఖ్యమేయగును నా ♦ కా దైవమే కూర్చుఁ నం
చిష్టంబొందిన బుద్ధిశాలి కెపుడే ♦ చింతల్ మదిం గల్గ వే
కష్టంబందునొ దేవు దూరుచును, సౌ ♦ ఖ్యంబబ్బుచో మత్తుఁడై
నష్టస్మారతనొందువాఁడు నరుఁడో ♦ నా? సూర్యనారాయణా! 29

శా. వ్యామోహంబనెడుగ్రహంబు యెపుడున్ ♦ బాధించుచో దానినే
హోమంబైన జయింపనేరదధికో ♦ ద్యుక్తుండునై యాత్మబో
ధామధ్యంబున నిశ్చలాత్మతొపున ♦ స్తాపాగ్ని సజ్ఞానముల్
హోమంబొప్పఁగ చేయ దగ్ధమగుజు ♦ మ్మో! సూర్యనారాయణా!

మ. అనఘత్వంబున వృద్ధినొందుటయె ము ♦ ఖ్యంబంచు తానోర్కిచే
తనె మర్త్యుండెటులుండు చంచలగుణా ♦ ప్రంబొంచు నెల్లప్పుడున్
మనమాదృష్టి నెయుడలేక నెదియో ♦ మాంద్యంబునం జిక్కి తా
వెనుకన్ ముందునుగాంచదంధజడతా ♦ స్థిన్ సూర్యనారాయణా!

శా. సంతోషంబని దుఃఖమంచు మిగులం ♦ జర్చించుటేగాని, యా
వంతైనన్ స్థిరమేమిగానబడదీ ♦ వాంఛల్ వృథాకాదె? వి
భ్రాంతిన్ స్వప్నమునందు పొందినటులీ ♦ భావంబులం దోఁచి ని
శ్చింతం గాలముఁ బుచ్చమేలగుజుమీ ♦ శ్రీసూర్యనారాయణా!

మ. సకలాశాపరిపూర్ణ దుర్భరమహా ♦ సంసార వాంఛాత్ముఁడై
సుకరావాప్యవిరాగ తత్త్వమును సం ♦ శోధింపగాఁజాలఁడా
రక మాయావృతజీవితాంబుధి విశా ♦ రాప్తోర్మి మగ్నాత్ముఁడై
ప్రకటానందసుతీరముంగనఁడు దే ♦ వా! సూర్యనారాయణా! 33

శా. స్వాంతంబెంతటివంతనొందినను లే ♦ శంబాశ నాశించకా
వంతైనంజలమొందకుంటయె ఘనం ♦ బౌ నర్థికిన్ భూపురుల్
ప్రాంతోచ్చస్థితినొందకాంతుఁగలుగన్ ♦ బాధించు నాశామతిన్
చింతాభావము తుల్యమేయగుఁగదా? ♦ శ్రీ సూర్యనారాయణా!

శా. అజ్ఞానింగని బాగుసేయనెదియో ♦ యాలోచనన్ దెల్పుచో
విజ్ఞానంబునుగోలుపోయి తనకే ♦ వేనాపదల్ గూర్ప మ
రంజ్ఞుండై యిటుపల్కెనంచు మదిలో ♦ భావించి, యాధర్మస
త్ప్రజ్ఞాశాలిని దూలనాడుగద? దే ♦ వా! సూర్యనారాయణా! 35

శా. పాపంబేయెప్పుడున్ బ్రధానముగ తా ♦ భావించు దుష్టుండుదిన్
కోపంబూని యముండె శిక్షబరుపన్ ♦ గుందున్ మనంబిప్పుడే
దీపింపంగలబోధఁజేసినను బూ ♦ దింబోయు నాజ్యంబుగా
నాపాపాత్ముకు బుద్ధికీలచనద ♦ య్యా! సూర్యనారాయణా! 36

మ. సతతంబీశ్వరభక్తి, ధర్మపథసం ♦ చారంబునుంగల్గు స
న్మతిమంతుండును దుష్టచారికెపుడున్ ♦ మాన్యుండుగా కుండుచో
గతమైపోవునె? శక్తి, సంపగిని భృం ♦ గంబెంత దూషించినన్
వితథంబౌనె తనప్రభావము? సుధీ ♦ ప్తిన్ సూర్యనారాయణా!

మ. మతిమంతుండగునంతమాత్రనె ఫల ♦ బౌ? బుద్ధి నాధ్యాత్మిక
స్థితినొందించి మనఃప్రభావ విదిత ♦ స్వీయాత్మ నిష్కాత్మ ని
శ్చితకర్మానుచరుండునై వివిధ దు ♦ శ్చేష్టాగ్రహీతాత్మభా
వతతఖ్యాతుఁడునై జరింపదగు దే ♦ వా! సూర్యనారాయణా!

శా. ధర్మాత్ముండయియుండుమానిసినిదు ♦ స్తంత్రింబులున్ యోజలున్
మర్మంబుల్ నశియింపజేయుగలవా? ♦ మాత్సర్యమేగాని స
త్కర్మాభ్యాస వివర్ధితాఖిల జగ ♦ త్కల్యాణుఁడౌ నీ మహా
ఘర్మంబెట్టులు ఘూకమడ్డగలదాగన్ ? సూర్యనారాయణా! 39

మ. అరయన్ లోకులదృష్టికెల్లపుడు నా ♦ త్మాఽనాత్మ విజ్ఞానియా
నరపుణ్యుఁడె విరుద్ధకార్యకలిత ♦ స్వాంతుండుగాదో మ ని
ద్ధరలో గన్పడు సృష్టిచిత్రముల నీ ♦ ధర్మాఽవరోధాఽఽప్తియే
కరమాశ్చర్యముగాగదోచుసుమీ య ♦ ర్యా! సూర్యనారాయణా!

శా. ఐనన్ లోకమునందు నిందలకు నే ♦ యాధారముంగల్గదే
మౌనస్థుండయినన్ మహాత్ముఁడయినన్ ♦ మాన్యుండునై యొప్పినన్
ధ్యానాప్తుండయినన్నదో యొకటి నిం ♦ దావాక్యమో పాపసం
ధానంబో జనులట్టె చుట్టుదురు గా ♦ దా? సూర్యనారాయణా!

శా. భీరుండందురు పాపభీతు నతిపా ♦ పిష్ఠుండ్రు శౌర్యార్ధ కా
ర్యారంభున్ గడులోభియందురు సద ♦ ర్థాఽఽకాంక్షినిన్ దుర్వ్య
యాఽఽ
చారుండందురు దానశీలుని బలా ♦ జశూన్యుఁడంచండ్రు స
త్త్వారిన్ శాంతుని క్రూరుఁడందురు ఘనతే ♦ జున్ సూర్యనారాయణా!

శా. మౌనిన్ మందమనస్కుఁడం చమల ద ♦ ర్మాఽఽకాంక్షినిన్
మూఢుఁడం
చానందార్థిని దుష్టబుద్ధియనుచున్ ♦ సన్న్యాసినిం దొంగయం
చానీతాత్మః విత్వ సారునితరా ♦ ర్థాఽఽహీనకార్యుండటం
చీనిందల్ పరమాత్ముకైనగలుగున్ ♦ శ్రీ సూర్యనారాయణా!

శా. చింతాభావము నెల్లవేళల నదో ♦ చేతంబునందాల్చుచున్
వంతల్ బొందుచునుండువానికటులే ♦ వ్రాప్తించుటల్ నిక్క మా
వంతైనన్ మది జంచలింపక సుహృ ♦ ద్భావంబులన్ దాల్చు ధీ
మంతుండొంకును సంతసంబు నె మహా ♦ త్మా! సూర్యనారాయణా!

శా. లోకం బేగురువంచు నెల్లపుడు నా ♦ లోచించు విజ్ఞానియే
యేకర్మల్ బచరించుచుండిన లవం ♦ బేనిన్ బ్రజావాక్యముల్
దాకంగల్గునె? లోకదూరమతుఁడే ♦ ధర్మంబులంగల్గినన్
రాకన్ మానునె నింద? లెల్లపుడు నా ♦ ర్యా! సూర్యనారాయణా!

మ. ధరలోనందరు నీశ్వరాంశజులెగా ♦ దా? మానవుండందుచే
పరజీవంబునుగాంచునప్పుడెపుడున్ ♦ భ్రాతృత్వ ధర్మంబుచే
జరియింపందగునంచు చెప్పునవియే ♦ శాస్త్రంబులు న్నీతులున్
దిరమైయుండెడు పుణ్యమిదియె సుమీ ♦ రీ! సూర్యనారాయణా

మ. మనుజుండెల్లపుడాత్మబోధగలుగన్ ♦ మాన్యుండునై యొప్పుచున్
ధనధాన్యాదుల నన్యకార్యములకై ♦ దానంబుగానిచ్చుచున్
దినముల్ బుచ్చగ మేలు కాని మదినుద్వేగంబునే బొందుచున్
ఘనమాశాబ్ధిని ముంచిగు దగనయం ♦ బా! సూర్యనారాయణా!

మ. తనజీవంబునె యన్యజీవమునకు ♦ త్సాహంబుతో సన్మనం
బున నాహారముగానొసంగుటయె ధ ♦ ర్మోద్దేశమై యుండగా
జనులీక్షుద్రపుజంతుజాలముల మాం ♦ సాశాంత్యులై చంపగా
జనునే? మానవకృత్యమా నెయిది? యీ ♦ శా! సూర్యనారాయణా!

మ. ధరలోబుట్టెడు సర్వజీవులకు నా ♦ ధారంబుగానుండగా
పరమేశుండిడెగాదె? మోక్షపదభా ♦ వంబొందు సద్జ్ఞానమున్
నరలోకాళికి నిట్టిక్రూరవధలన్ ♦ వాంఛించుచున్ మానవుం
డెరుగంజాలఁడిదేమి సత్యమును? తం ♦ డ్రీ! సూర్యనారాయణా!

శా. భేదంబొక్కటె యన్యజీవులకు ను ♦ ర్విన్ మానవశ్రేణికిన్
వేదోక్తంబుగ పుణ్యకార్యముల నే ♦ వేఁజేయగా జ్ఞానస
మ్మోదంబొందె నరుండు యిట్టితరజ ♦ న్మోచ్ఛేదముం జేయుచో
నాదుష్కార్యము దైవమోర్చునె? మహా ♦ త్మా! సూర్యనారాయణా!

మ. విదితానేకపురాణధర్మమతుఁడీ ♦ విశ్వంబునందెప్పుడున్
సదసద్జ్ఞానవిచారశూన్యభువన ♦ స్థానేక జీవాలినిన్
సదయాత్మంగని తుచ్ఛకార్యవిముఖే ♦ ష్టప్రాప్తసంతోషసం
పదలంబొంది సుఖించుచుండు జుమీ! దే ♦ వా! సూర్యనారాయణా!

శా. ఏమో మానవులైహికేచ్ఛలకునై ♦ యీరీతిఁ జింతింపగా?
నీమాయాజగమెల్ల శాశ్వతమటం ♦ చెంచన్ ఫలం బేమియో?
కామంబొక్కటిమాని చూచు నెడనీ ♦ కష్టంపులోకంబునం
దేమాత్రంబును తుష్టిలేదుగద? తం ♦ డ్రీ! సూర్యనారాయణా!

మ. ధనధాన్యంబులు నస్థిరంబులెగదా? ♦ తద్వాంఛకైయెప్పుడున్
మనమా వేగమునొందనేల? పరమా ♦ త్మప్రాప్తమౌ భాగ్యమే
ఘనమో కొంచమొ తుష్టిఁబొందదగు నే ♦ కాలంబునందైన బు
ద్ధిని దుర్వాంఛలఁజేర్పనౌనె? పరమూ ♦ ర్తీ! సూర్యనారాయణా!

మ. తనువుల్ శాశ్వతభావసిద్ధములు కా ♦ దంచున్ మనంబెర్గియున్
ఘనమోహంబుననున్న భాగ్యములనే ♦ కాంక్షించు నేమోగదా,
ము నిసేవ్యంబు విరాగమూలధనమౌ ♦ మోక్షంబునే గోరుచో
జను నేదుర్భరజన్మదుఃఖమును యీ ♦ శా! సూర్యనారాయణా!

శా. ధీరుండైధనరాసులెన్నిఁటిని నం ♦ తే గక్తి నార్జించినన్
సారంబైనవిచిత్రవస్తువుల నా ♦ సన్ రాశిగాగూర్చినన్
తీరన్ గాలము సర్వభోగముల నం ♦ దేడించి తానేగుచో
జేరన్ రాదొక చిల్లిగవ్వయునయున్ ♦ శ్రీసూర్యనారాయణా!

మ. ఘనకార్యంబుల నెన్నిఁజేసినను భో ♦ గాఢ్యత్వముంబొందినన్
ధనధాన్యంబులఁగూడబెట్టినను, ని ♦ త్యానందుఁడైయొప్పినన్
తనువున్ భూమినిడించి యాత్మపరమా ♦ త్మజ్ఞానుసారంబునై
జనుచో తోడుగరాడదేమియును నీ ♦ శా! సూర్యనారాయణా!

శా. దేహంబందున ప్రాణముండువరకున్ ♦ దృష్టింగనన్ లేక యే
మోహంబందునొ మున్ని మానవుఁడు త ♦ న్మోక్షార్థకార్యంబులం
దూహన్ లేక చరించి యంతమున కా ♦ లోద్వేగబద్ధాత్ముఁడై
హాహాకారములెన్నిఁజేసిన ఫలం ♦ బా? సూర్యనారాయణా! 57

శా. ఆలించున్ సుతులంచు మోహమతులై ♦ యారాటముంబొందగా
నేలా? ప్రాణములుండు నంతవరకే ♦ యీ బాధముల్ గాని త
త్కాల పుంగతిఁజచ్చుచో తనువునం ♦ తన్ బూదిగా జేయుచో
నాలేమౌనో? సుతుండునేమగునో ? దే ♦ వా! సూర్యనారాయణా!

శా. కామాంధుండయి జీవమున్నపుడు స ♦ త్కార్యంబులంజేయక
భూమిన్ భార్యయు,మిత్రులున్ వరగృహం ♦ బుల్ గల్గగాగోరుచున్
వ్యామోహంబునఁదల్లడిల్లు దుదికా ♦ లాజ్ఞన్ దివింజేరుచో
నేమైపోవునో యున్నివాంఛలును తం ♦ డ్రీ! సూర్యనారాయణా!

శా. కాయంబున్ దగు వస్త్రమాల్యగులచే ♦ గట్టాగవాంఛించినన్
తోయంబందునశుద్ధిఁజేసినఁగలెం ♦ తోరక్తితోఁదాల్చినన్
మాయాబద్ధమునై నశించి చనుచో ♦ భారంబుగా గీర్తనే
మోయుంగానియువన్నియున్ వృథయొసు♦మ్మో!సూర్యనారాయణా!

శా. పెక్కుల్ భాగ్యములుండు కాలమునసం ♦ ప్రీతిన్ మదింగూర్చుచున్
నిక్కంపుంబ్రియులైమూగుదురు యొ ♦ న్నేఁజెప్పుచున్ మానవుల్
అకాలంబెటోమారునప్పుడు దరి ♦ ద్రావాప్తకష్టంబులం
దొక్కండేవియు తోడురాదలపఁడో ♦ హా! సూర్యనారాయణా!

మ. మదిలోనన్ ధనవాంఛపుట్టునెడ దు ♦ ర్మార్గక్రియారంభులై
పదిమందిన్ దలగొట్టియైననది సం ♦ పాదింపగానేల? నె
య్యదియైనన్ స్థిరమంచుజెప్పగలరో? ♦ యాపాపవిత్తంబునున్
దుదినేమైన ధరించిపోవుదురొ? యొం ♦ కున్ సూర్యనారాయణా!

శా. త్యాగాసక్తివిదూరభాగ్యమును, భా ♦ గ్యానాప్తమూద్యోగము
ద్యోగప్రాభవశూన్యవిద్యయును, వి ♦ ద్యోన్ముక్తవాగర్థమున్
వాగర్థాంగవిహీనవాదమును స ♦ ద్వాదానభిజ్ఞాత్మ దు
ర్వేగోత్థంబగు భక్తియున్ వృథయె తం ♦ డ్రీ! సూర్యనారాయణా!

మ. బలహీనస్థితిఁబౌరుషంబు బలభా ♦ వంబందు శాంతత్వమున్
కలుముల్ నోవగ సౌఖ్యమున్ గలిమిగ ♦ ల్గన్ దేవతాభక్తియున్
చలితాత్మన్ బహు విద్యచంచల విన ♦ ష్టంబైన లక్ష్మీస్థితిన్
యిలలోగాంచగ కష్టమౌను కతమే ♦ మీ! సూర్యనారాయణా!

మ. గురువిద్రోహికి ధర్మభీతియును దుః ♦ ఖోజ్జీవికిన్ దృప్తియున్
బరహింసారతికినాత్మచర్చయు నథ ♦ ర్మాచారికిన్ సత్యమున్
అరిజుష్టాత్మకు నిర్విచారమును వి ♦ ద్యాహీనుకున్ హృద్య ప
ద్యరసాస్వాదనమున్ గలుంగదు గద♦య్యా!సూర్యనారాయణా!

మ. చదువుల్ సచ్చరితంబుచే మనము నా ♦ శాదూరసద్బుద్ధిచే,
హృదయంబీశ్వరభక్తిచే, గృహము ని ♦ త్యేష్టోత్సవప్రీతిచే
ముదితల్ సాత్త్వికభావవర్తనలచే ♦ మోదంబు సత్వంబుచే
గన భాసిల్లుచునుం డచింత్యగుణయు ♦ క్తా! సూర్యనారాయణా!

మ. పరనిందన్ గృహకృత్యమున్ నిజవధూ ♦ భావానుగుణ్యాత్మనున్
పరకార్యంబును భాగ్యదుర్వ్యయము త ♦ త్త్వాపప్రభావంబు ని
ద్ధరధర్మంబును యోజసేయకతమో ♦ ధామప్రవిష్టుండునై
పరకాంతామతుఁ డంధతుల్యుఁడగు దే ♦ వా! సూర్యనారాయణా!

శా. దేహంబంతయు దీర్ఘరోగమయమై ♦ ధీశక్తివిచ్ఛిన్నమై
మోహాంబాత్మకు కాలపాశనిభమై ♦ భోగంబు సూన్యంబునై
యూహల్ తప్తమనఃప్రభూతములునై ♦ యుండన్ సదాకాముకుం
డీహైన్యంబుభరించి చింతపడుగా ♦ దే? సూర్యనారాయణా. 68

మ. చదువుల్, బోధలు, యాగముల్ దపములున్ ♦ స్నానంబులున్ యాత్ర
పదిలంబౌగతిఁ జేసినన్ దనకుదై ♦ వప్రీతికూల్యంబునం (లున్
గుదయంబొందదు భాగ్యరేఖయిఁక దై ♦ వోత్కృష్టసాహాయ్యమం
దదియేవచ్చినరించి భాగ్యమిడుగా ♦ దా? సూర్యనారాయణా!

శా. కష్టంబో యపకీర్తియో నిజమనః ♦ కాఠిన్యమో నిందయో
నష్టంబో నగుబాటులో నరకమో ♦ నానాప్రబాధాప్తియో
స్పష్టంబైన దరిద్రకాలమున నో ♦ ర్చుంగల్గి సద్బుద్ధిచే
హృష్టాత్ముండగువాఁడె ధన్యుఁడగుసు ♦ మ్మీ! సూర్యనారాయణా!

శా. అన్యుల్ సంతసమంది మెత్తురను భా ♦ వంబంది సద్వాక్యముల్
మాన్యుండట్లవచించి దుష్కృతములన్ ♦ మానంగలేసట్టి యా
శూన్యజ్ఞానునికంటె నజ్ఞతనెదు ♦ ష్టాపాయుఁడౌ మూఢుఁడే
ధన్యుఁడించుకయుంమ చెప్పనగు గా ♦ దా? సూర్యనారాయణా!

శా. భక్తుండంచువచింపనేమియగు? త ♦ ద్భావంబు సత్యప్రభా
యుక్తంబైదగు నిశ్చలంబెయగుచో ♦ యోగ్యుండుగానేర్చు యో
గ్యోక్తుల్ సెప్పుచునీచకార్యపరమౌ ♦ యూహన్ సదాదాల్చునా
భక్తుండేగును నారకంబునకె దే ♦ వా! సూర్యనారాయణా! 72

శా. లోకంబందునగల్గియుండిన మహా ♦ లోపంబు యీభక్తిలో
నేకాదా? మదిమూఢభావమును నెంతే ♦ దాల్చు సద్భక్తిశూ
న్యాకీర్ణాత్మవిమోహకల్పితతరా ♦ ర్థప్రాణహింసార్థి దు
ర్ణోకానీకముఁబ్రోచి గూర్పమయమే ♦ లున్ సూర్యనారాయణా!

మ. ముదిమిన్ సౌఖ్యము లొల్లజాలనపుడే ♦ మోక్షార్థివై భక్తిసం
పదనొందం దగునంచు జెప్పఁగదవా? ♦ భావంబు కామాది దు
ర్గదజుష్టంబగు యౌవనంబున నె తత్కాంక్షా నిరోధాత్మ శ
ర్మదభక్తిస్థితిగల్గ యోగ్యమగు నా ♦ ర్యా! సూర్యనారాయణా!

మ. మనమందావృతమైన మోహమతిచే ♦ భావంబు నజ్ఞానముం
జనగా యోజనులేక కాంతలకు సం ♦ సారంపు కార్యంబులన్
జనువుల్ గూర్ప క్రమక్రమంబున నటుల్ ♦ సౌమ్యంబుగానుండలే
క నయంబద్దియె శత్రుతుల్యమగుగా ♦ దా? సూర్యనారాయణా!

శా. పత్నుల్ గూఢమనఃప్రధానకలుష ♦ ప్రఖ్యాతులేవైన స
ద్యత్నారంభత నాదురుత్తములు నా ♦ నాకారయుక్తంబులౌ
రత్నంబులు గనుపట్టుచుండునగదరా ♦ లన్? స్నిగ్ధతం జెందు నా
రత్నం బేమదికింపుఁగూర్చుఁజుమి! యా ♦ ర్యా! సూర్యనారాయణా!

మ. వనితాభోగములందతృప్తినిగనన్ ♦ వాంఛించి సంసారబం
ధన దూరీకృతపుణ్యకార్యుఁడగుచున్ ♦ దర్పించుటల్ కంటె న
వ్వని తాభోగములం దతృప్తినిగనన్ ♦ వాంఛించి సంసారబం
ధనదూరీకృతుఁడౌట మేలగునుగా ♦ దా? సూర్యనారాయణా!

మ. భవబంధంబునగల్గు చింతలను బా ♦ పంగజాలు నిన్ గొల్చుచున్
సువివేకమ్మున భక్తులెల్లపుడు సం ♦ శుద్ధాత్ములైయుందు రీ
ప్రవహత్ప్రాణిభవప్రణాశయుత దు ♦ ర్వారప్రవాహంబున
న్నవయం జేయకనుమ్ము బ్రోవుమయనం ♦ తా! సూర్యనారాయణా!

మ. ఉదయంబస్తమయంబునీవలననే ♦ యుద్భూతమైయుండు న
య్యదియే ప్రాణులకెల్ల జీవనప్రధా ♦ నాధారమైయుండెగా?
విదితాత్మప్రభగల్గుమానవులు నీ ♦ వే సర్వలోకావనా
త్మదయాసాంద్రుఁడవంచు నెంతురు మహా ♦ త్మా సూర్యనారాయణా!

శా. ఎన్నన్నీవె సమస్తలోకపతివై ♦ యీరీతిఁగన్పట్ట నా
పన్నుల్ సంతతభక్తితత్పరత స ♦ ద్భావంబుచే సంధ్యలన్
నిన్నేగొల్చుచు ముక్తినొందుదురు స ♦ న్నిష్ఠలు తపోదానముల్
జన్నంబుల్ సరియౌనె నీనుతితో? యీ ♦ శా! సూర్యనారాయణా!

మ. దినముల్ మాసము లబ్దముల్ చనఁగ నీ ♦ తేజంబె మూలంబుగా
లనియోగంబునకీవె కారణముఁ లీ ♦ లన్ నీవె సాక్షిత్వముం
గని సత్యంబు జరించుచుంటివి సుభ ♦ క్తానీకమున్ బ్రోతువే
ననయంబుండుచె నిన్నుఁ గొల్తు నయ! దే ♦ వా! సూర్యనారాయణా!

మ. పలుభావంబుల నూనియుండఁగ ఫలం ♦ బా? సర్వలోకంబునన్
గలదేవాళిని నేత్రగోచరుఁడవా ♦ కారుణ్యమూర్తీ! నినుం
జలనుల్ లేనిమనంబు చేఁగొలుతు నా ♦ శాపాశహీనంపు ని
త్యలసత్సౌఖ్యముఁ గూర్చుచుండుమయ! దే ♦ వా! సూర్యనారాయణా!

శా. ఆరోగ్యంబునకీవె కారణమటం ♦ చానంద సంప్రాప్తికిన్
భూరిప్రాభవమా భవద్వినుతియే ♦ మూలంబటంచున్ సదా
ధారంబౌ శ్రుతియే వచించు సకలా ♦ ర్థంబుల్ సమస్తాంజలుల్
సేరంగల్గును నీ స్వరూపమునకే ♦ శ్రీ సూర్యనారాయణా! 83

మ. మనముల్ దుర్విషవేగదూరముగ తా ♦ బంధించి నిత్యంబు సూ
ర్యనమస్కారములాచరించెను జనుం ♦ డానందముం జెందు నం
చను నీభావము లోకమందలమె వి ♦ శ్వంబుందు నిన్గొల్చు వాఁ
డెనయంజాలఁడు కష్టమెన్నఁడును తం ♦ డ్రీ! సూర్యనారాయణా!

మ. మనుజుల్ నిన్గని బ్రహ్మరూపముదయం ♦ బందున్ మహేశాధి మూ
ర్తిని మధ్యాహ్నమునందు విష్ణుమయమూ ♦ ర్తిన్ సాయమాకాలమం
దునఁ దాల్చు ప్రభువర్య గావుమని యెం ♦ తో భక్తితో సన్నుతిం
చినముక్తిం దయసేయుచుందువుగదా? ♦ శ్రీసూర్యనారాయణా!

శా. బాల్యంబందునఁ గ్రీడలందు మునుఁగన్ ♦ భావించి తారుణ్య చా
పల్యంబందున కామభావచరుఁడై ♦ వార్ధక్యముం బాప్త బా
హుల్యానీకజరావళీ పలితుఁడై ♦ యుండన్ సదాచిత్తచాం
చల్యంబందిన యాఁడు ముక్తిఁ గనఁడీ ♦ శా! సూర్యనారాయణా! 87

మ. అరయంజాలక దేశదేహ విభవా ♦ నందంబులన్ మానవుం
డురుమోహంబున మున్గియుండెను విదే ♦ శోత్సాహ ధీ శ్రీసమా
దరణైక్యత్వమతి ప్రచండకరణా ♦ ధారంబులన్ బొందగా
దెసవుంజూపి ప్రశాంతిఁ గూర్చుము! సుమూ ♦ ర్తీ సూర్యనారాయణా!

శా. పూర్వప్రాభవసత్యధర్మపథముం ♦ బోవంగనూహింపకే
గర్వంబొంది నవీనభావకలితా ♦ కారాఽప్రియాచారులై
సర్వానర్థములొందుమానవుల దు ♦ ష్కార్యంబులన్ మాన్పి నీ
వుర్విన్ ప్రాక్కృతధర్మముం నిలుపుమా!♦యోసూర్యనారాయణా

శా. ఆచారంపు యథార్థతత్త్వమును తా ♦ మావంతగుర్తింపకే
దోచిత్తంబున మూఢబుద్ధిఁగని ని ♦ త్యోత్కృష్టకార్యంబులన్
ప్రాచీనోక్తి విరుద్ధమంచుఁ గనెడు దు ♦ ర్వాద ప్రజానీకమున్
వాచాదోషములూడ్చి బ్రోవుమయ! దే♦వా! సూర్యనారాయణా!

మ. మతముల్ పెక్కులటంచువాదములచే ♦ భావింపగా నేలనో
మతిద్వైతార్చన సత్యబుద్ధియును ధ ♦ ర్మంబాను నీమూఁదునే
మతమందైనను ముఖ్యమేగద? వృథా ♦ మాత్సర్యవాదంపు దు
స్థితినొందు ప్రజనుద్ధరింపగనుమో! ♦ శ్రీ సూర్యనారాయణా! 90

శా. ఈవాదంబులు నీవిమోహమతు లీ ♦ హీనక్రియాఽఽచారముల్
భావస్వచ్ఛతనొందలేని భవసం ♦ బద్ధాత్ముకే గాని స
ద్భావావిష్కృతసర్వజీవసమత ♦ త్వాత్మస్థశక్తిజ్ఞ భూ
దేవుండైన నరుండుగోరునె కుబు ♦ ద్ధిన్? సూర్యనారాయణా!

మ. సకలానర్థములొంది లోకమిటుల ♦ స్వాస్థ్యంబుచేగుందగా
నకలంకాత్మక వర్ణసంకరమె గా-గా? కారణంబీవె యీ
ప్రకటాచారవిభాగశూన్యకృత కా ♦ ర్యావిష్టులౌ మర్త్యులన్
వికసత్స్వాంతులఁజేసి కీర్తినిడుము ♦ ర్విన్ సూర్యనారాయణా!

శా. స్నానంబుం జపమున్ సధర్మగతి ని♦స్సంగత్వముం సత్యమున్
జ్ఞానంబన్యహితార్థచింతనము శౌ ♦ చంబర్థవిద్వేద వి
ద్యానైపుణ్యము తత్త్వబోధనము నీ ♦ ధర్మంబులన్ భూసుర
స్థానంబందునఁగూర్పుమయ్య! జగదీ ♦ శా! సూర్యనారాయణా!

శా. ధర్మజ్ఞత్వము రాజ్యపాలన సువి ♦ ద్యాచాతురీ భావముం
మర్త్యోన్మూలకవాగ్విశుద్ధి బుధ స ♦ న్మానాది విఖ్యాత స
త్కర్మాభ్యాసమునార్తరక్షణము స ♦ త్యస్థైర్య మీతొత్స
ద్ధర్మంబుల్ భువివృద్ధిఁజేయుము మహా♦త్మా! సూర్యనారాయణా!

మ. ధనభోగైకవిహీన సత్యమతులున్ ♦ ధాన్యాదివస్తుక్రియాఽఽ
ఘనకాంతారహితాత్మవృత్తియును స-త్కార్యార్థచింతానిబం
ధనముల్ ధర్మపథానువర్తనము నా♦ధారంబుగా వర్తకో
న్మనముల్ సద్గుణగణ్యతం గనగని ♦ మ్మామ్మా! సూర్యనారాయణా!

మ. సతతంబగ్ర్యజభక్తి గాయకృతక ♦ స్తాపాదినానేకభూ
జతనిష్ఠోద్భవసత్ఫలైక సుఖవా ♦ సం బన్యజీవాఽఽవన
స్థితపుణ్యోద్భవభాగధారణగుణ ♦ శ్రీయోగముల్గల్గు నా
మతినంత్యోద్భవజాతిగూర్పుము మహా-త్మా! సూర్యనారాయణా

మ. ఒకకార్యంబు మహోన్నతజాతిగానగా ♦ నొండర్షముల్లేక తా
మొకదారిన్ స్వకులస్థధర్మములను ♦ న్మాలించి యత్యక్రియా
వికలాచారులునై జనుల్ చరించుటగదా ♦ విశ్వంబునిట్లయ్యె నీ
విక నీదృక్పరిణామమాపదగుజు ♦ మ్మామ్మా! సూర్యనారాయణా! 97

శా. నిత్యంబీ భవమగ్నులైన జనులన్ ♦ నిర్గొల్పుచున్ లోనదు
ష్కృత్యంబుల్ విడనాడి మానసికళ ♦ క్తిన్ వ్యర్థముం జేయకే
సత్యంబౌ పథము జనుల్ సకలమాం ♦ ఛాపూర్ణ సద్భావులై
యత్యానందమునొందియుండరా? దేవా! సూర్యనారాయణా!

మ. సకలార్థంబులు సర్వభోగములు వి ♦ స్తారాత్మశక్తి ప్రభల్
పికసత్పూర్వకలావిశేషములు వి ♦ ద్వేషోక్తిహీనార్యులున్
అకలాకాంచితదైవభక్తులును దే ♦ శైశ్వర్యమైయుండ తా
వకమా సత్కృపస...జూష్మమయ! దే ♦ వా! సూర్యనారాయణా!

శా. నీతిక్షాయుత సత్ప్రబోధమున నె ♦ న్నేగీతులన్ నీతులన్
వైశద్యంబుగ వ్రాయుదీనగల భా ♦ వంబుల్ జనుల్ గాంచి యీ
ర్ష్యాశూన్యంబుగ నాచరించుచు సదా ♦ చారాత్ములైయుండగా
నాశీర్వాదములీయుమయ్యా! గురువ ♦ ర్యా! సూర్యనారాయణా!

శా. ఓ వేదార్థవిచార్యతత్త్వభరితా! ♦ యోగిప్రజోద్ధారకా!
భావాఽచింత్య! భవాబ్ధితారక! వరా! ♦ భద్రార్థసంధాయకా!
భూవైత్ర్యవిదూర! పుణ్యపురుషా! ♦ పూతప్రభావాఽఽవృతా
దేవానీకనుతా! నతార్తిహరమూ ♦ ర్తీ! సూర్యనారాయణా!

[illegible] ధితనాకవీధిచలనా ! ◆ భక్తాఘనిర్మూలనా !
శైవల్యారసుదానరోగ్యకిరణా ! ◆ కాలక్రియోద్ధారణా!
ధీవైశద్య దురూహ్యమూర్తి కలితా ! ◆ తేజోహృతాశాలతా !
శ్రీపిస్ఫూర్జితసత్వపాలనగుణా ! ◆ శ్రీ సూర్యనారాయణా ! 10
మ. అతిభక్త్యావృతహృత్సరోజ సుజనా ◆ నందామృతాంభోనిధీ!
స్థితమాయామయలోకజాల వివృతా ◆ శేషాత్మమూర్తి ప్రభా!
హతదుశ్చారకుగర్వ సర్వకలితా! ◆ నంతాత్మకా! వేదసం
స్థితమాహాత్మ్యవిరాజితార్థవిభవా! ◆ శ్రీ సూర్యనారాయణా !
మ. సకలాశాఘహరా! మహాత్మ్యభవ తే ◆ జస్స్వాత్మవిస్తార! తా
రకమంత్రాక్షరకరా! కరాళభవభా ◆ రక్లేశసంహార! హా
రకృతాఽశేషసుభక్తసన్నుతిమహా ◆ ప్రాధాన్య! ధాన్యాది వ
స్తుకరాధార జగద్విధానప్రభవాం ◆ శూ! సూర్యనారాయణా !
శా. నిత్యానందమహోపధానాగమనా ◆ నేకప్రజోద్ధారకా !
సత్యస్వాశయప్రాప్తకష్టగమనా ◆ చారక్రమోద్భాసితా !
కృత్యాచారప్రధాన నిర్మిత నమ ◆ స్కృత్యాగమప్రాభవా !
యత్యానందిత భక్తపాలన గుణా ◆ రా! సూర్యనారాయణా!
శా. సర్వోత్కృష్టకజైత్ర! సాత్త్వికసదా ◆ చారక్రియాపాత్ర! స
ద్గోర్వీవ్యావృతకార్యచిత్ర! నిఖిలా ◆ గ్రోత్సాహ సన్మిత్ర! స
న్నిర్వాణప్రదభావసూత్ర! నిగమా ◆ నీకావృత స్తోత్ర! దు
ర్గర్వారి ప్రచయాఽఽలవిత్ర! భవనే ◆ త్రా!సూర్యనారాయణా!
మ. పరమాన్నాది మహాఽచలావృతనుతి-ప్రఖ్యాత మాహాత్మ్య భా
సురకాంతిప్రసరప్రవర్తిత జగ ◆ చ్ఛోభాభవద్భవ్య భూ
చరజంతూర్వి, మధి, ఖేచరాంబునిలయ ◆ స్వర్గామజీవావళీ,
స్థిరకార్యాదృతమూర్తి చిత్రవిభవా! ◆ శ్రీ సూర్యనారాయణా !
మ. భువనాధార!నమోస్తు భూసురజనా ◆ మోదకృతానేక స
త్సవనాధార ! నమోస్తు సూక్తినిచయా ◆ ధానప్రభావృత వే
దవనాఽఽచారనమోస్తు నిర్గతభవా ◆ స్థానీతసద్భక్తి పా
ణ్యవనాఽఽచారనమోస్తు దేవ! పరమే ◆ శా!సూర్యనారాయణా!

సమాప్తం.